# నీతికథావల్లరి

పూర్వకవికృతంబులగు కేయూరబాహుచరిత్రము,
పంచతంత్రము అను గ్రంథములనుండి యేర్చికూర్చిన

(పద్యకథలు.)



మొదటికూర్పు 1000.

మేనేజరు
ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,
పిఠాపురము.

1927.

[ వెల 0—8—0.



పిఠాపురము.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల,

౧౯౨[illegible]



# పీఠిక.

విద్యార్థుల కుపన్యాసరూపమున విషయమును బోధించుటకంటెఁ గథారూపమున బోధించుట సులభముగా నుండును. అట్టికథలను గ్రొత్తగ వ్రాయుటకంటెఁ బూర్వకవుల కావ్యములలోని కథలను బోధించుటవలనఁ గావ్యగుణమునం దధికగౌరవము గలుగఁగలదు. కావునఁ బూర్వకవులగ్రంథములలోనుండి మేమీ నీతికథలు విద్యార్థుల కధికోపయోగకరంబులుగా నుండునని యెంచి యేర్చి కూర్చి ప్రకటించితిమి. విద్యాధికారులు మాయుద్యమము నాదరింపవలయు నని కోరుచున్నాము.

ప్రకాశకుఁడు.

# విషయసూచిక.



# నీతికథావల్లరి

## ప్రథమభాగము



### ౧. చదువుకొన్న మూర్ఖుడు

క. గార్గ్యుఁ డనువిప్రుఁ డొకరుఁడు
దుర్గారాధనముఁ జెక్కుదొసఁగులఁ బఱచుచున్
దుర్గాటవిలోఁ జేయ ని
రర్గళగతిఁ దన్నుఁ జూచి యాయంబికయున్. 1

క. వర మడుగు మనిన మ్రొక్కుచు
సరభసమగుకాంక్షతోడ సంజీవని ని
ర్భరకరుణ న్నాకొసఁగుము
పరమేశ్వరి యనినఁ గొన్ని పచ్చనియాకుల్. 2

చ. తలఁచినమాత్ర నాత్మకర
తామరసంబున నున్న వాని ని
మ్ములఁ గృపఁజేసి వీని రస
ముం బయిపైఁ జిలికింపఁగా శవ

మ్ములకును బ్రాణముల్ గలిగి
　　ముంవటిరూపము వచ్చి తేజముం
బలమును జెంది పూర్వగుణ
　　భంగిఁ జరించుట కల్గు నెల్లెడన్.

క. ఎండవు తఱుఁగ వనుచు నిడి
చండిక పొడఁగానరాక చనుటయు మదిలో
నిండిన సంతసమున వి
ప్రుం డవిగొని యాత్మపురము జొచ్చె వనౌకరుఁడున్.　　4

చ. చనునెడ నిర్జనమ్మ మగు
　　చక్కటి నప్పెనుగాన నెండిపో
యిన యొకపుండరీకశవ
　　మీరము వెల్పల నున్నఁ జేరఁగాఁ
జని తనకన్న యౌషధము
　　శక్తి నిజంబుగఁ జూడ నెంచి చే
త నలఁపి యాకులం బసరు
　　దానివయిం బిడిచెం గుబుద్ధి యై.　　5

. పిడిచిన నేమిచెప్ప నతి
　　భీకరదుస్సహపుండరీక మ
ప్పుడ తన నిద్ర మేల్కనిన
　　పోలిక మోగుచు బిట్టు లేచి య

న్వాడఁ గగువిప్రుఁ గూయిడఁగఁ
జేసి మృతుం బొనరించి మ్రింగె మే
ల్వడసియు బుద్ధిచాలనియ
భాగ్యులు తత్ఫల మందనేర్తురే. 6

మతియ కళాకృషిబీజము
మతియ తనఫలప్రదక్షమాజము తలఁపఁ
మతియ చెలి మతియ చుట్టము
మతిహీనులు చూడ మొరడుమ్రాకులు ధాత్రిన్. 7

## ౨. పోరునష్టము



నర్మదతటమున హింసా
కర్మం బొరు లెఱుఁగకుండఁ గాఁపురి [illegible]
ధర్మమునఁ జరించు కపట
ధార్మిక మొక్కపులి యొక్కతరుకుంజమునన్. 1

ఇట్లు వర్తింపుచుండ నొక్కనాఁ డవ్వనంబున మృగంబు లెల్లఁ బెద్దయు నమ్మి తమ్ముఁ బరిపాలించుట వేఁడిన నది యును హింసాధర్మంబున దండనం బొనరింపంగాని న్యాయాన్యాయంబులు నిర్ణయించి మిమ్ముఁ దగుభంగి శిక్షిం

పేఁగలవాఁడ ననియె నవ్విధం బట్లు చెల్లుచుండ నొక్క
నాఁడు. 2

క. ఒక్కయెడం దమలో నొక
బొక్కకు వా దడిచి శశకముఁ గపింజలముం
గ్రక్కునఁ బఱతెంచి పులికి
మొక్కుచు నిజవాద మిరువురుం జెప్పటయున్. 3

వ. ఆవ్యాఘ్రంబును వానితోడ. 4

గీ. ముదిసినారము కానము మున్నువోలె
శ్రవణములు దూరమును వినుశక్తి లేదు
కదియఁ జనుదెంచి చెప్పఁడు కార్యమనుచు
నవియుఁ దేకువమాలి డాయంగ నడువ. 5

క. ముందటికాళ్ళం గొని యా
కుందేలుం గైదుఁ బట్టికొని గొంతుక నం
దంద కఱచి భక్షించి య
మందప్రీతిఁ బులి శౌర్యమత్తమై యుండెన్. 6

క. అలఁతు లగుకార్యములు ఘన
ములునేసి చలంబుపేర్మిఁ బోరఁగ నది రా
జులచెవులఁ బడ్డ నిరుదెసఁ
గులవారికిఁ జాల గీడగుట సందియమే. 7

## ౩. అకారణకలహము, ఆత్మవినాశము.

క. ధరణిపయి లాటనరపతి
పురిఁ దేనియ నమ్మఁగోరు బోయలపల్లెం
జరియించుచుండువాఁ డొక
పురుషుం డది యొక్కకలశముఁగొని కడఁకన్. 1

వ. అరిగి యానగరంబున నొకసన్నపు వీథియందు. 2

ఉ. తేనియకుండ మోచికొని
దిక్కులు నాలుగు బిక్కచూడ్కి నే
దేనియుఁ జూచుకొంచు నొక
యేనికకట్టెదుటన్ మదాంధమై
రా నచటం దొలంగెడు పు
రంబుజనంబును జూచి భీతుఁడై
తానును నుత్తరించుచుఁ బ
దంబులు తొట్రుపడంగఁ బాఱుచున్. 3

గీ. వడఁకుఁ గొని నిలవఁ ద్రొక్కని యడుగు కొంత
జాతి మ్రొగ్గతిలంబడఁ బాఱుటయును
నిండి మూఁపుఁదాల్చిన కుండ తొలఁకి
యొలికె మధుబిందు వొకకొంత యుర్విమీఁదఁ 4

సీ. ఆతేనెబొట్టున కచట నీఁగలుముసి
రిన వానిఁ బట్టంగ నని కడంకఁ
జేరె నచ్చటి కొక్క చెలంది, యాచెలంది మ్రిం
గిన బల్లి నొకపిల్లి దినియె, నంత
నాపిల్లిఁ గఱచె రాజాధీన మగువేట
కుక్కయొక్కటి, దానిఁ గోప మడరఁ
బొడిచె బిడాలంబు, నొడయనినగరికు
క్కలవారు చంపిరి కడఁగి దాని

గీ. దాని నాడవారు తవిలి చంపించిరి
కుక్క, నూతఁ గినిసి కుక్కవేఁట
కాండ్రు రంపఁజేగి కత సవిస్తరముగ
నృపతితోడఁ జెప్ప నృపతి యలిగి.

మ. తగ ప్రాహింవక యూరివాడప్రజలం
దాఁ జంపఁగాఁ బంచినన్
జగతీవల్లభుఁ డైననేమి యని యు
త్సాహించి సన్నద్ధులై
నగరం గొల్వనివార లొక్కదెసనై
నానాయుధోపేతులై
తెగి భూపాలకసేనఁ దాఁకిరి మహో
ద్రేకంబుతో నార్పుచున్.

ఉ. రెండవ తెలుంగుమూఁకలును
రిత్తకు రిత్త చలంబు పెంపునన్
భండన ముగ్రభంగుల నొ
నర్పఁగఁ బెక్కులు ద్రెళ్ళెఁ బీనుఁగుల్
కండలుఁ ద్రేవులుం గలసి
కాలువలై యొసలారె నెత్తురుల్
కుండలచారుమస్తములు
గుప్పలుగట్టె పురంబువీథులన్. 7

వ. అట్లగుటం జేసి. 8

క. కడుసన్నపుఁగార్యము నె
క్కుడురోసముతోడఁ బెనఁగి కుమతులు మహాఖ్యం
బుడుగక పెద్దయు సేగిం
బడుదురు చుమి లాటన్నృపతిపౌరులు వోలెన్. 9

---

౮. దుర్జనునిదూరము చేయవలయును.

సీ. ఒకపర్వతమువీఁద నొప్పెడుకొలనిలో
నంచలు కొన్ని యిచ్ఛానువృత్తిఁ
బగ లెల్ల విహరించి భానుఁడు గ్రుంకంగఁ
బాపాత్ములకుఁ జేరఁ బోఁకరాని

యున్నతోన్నతమగు నొకగండశిలయందు
కేలెల్ల సుఖలీలఁ గ్రాలుచుండు
నట్లుండఁ దద్గ్రహణాపేక్ష నొకబోయ
తెంకిపట్టరసియుఁ దేఱిచూడ

గీ. లేక యరిగెను నొకనాఁడు కాక మొకటి,
ప్రొద్దుగ్రుంకిన నచటుగాఁ బోయిపోయి
ఖగనినాదము విని వాని గదియవచ్చి,
యుండుటయుఁ దానిఁ గని హంసయూథ మెల్ల.

ఉ. ఎచ్చటనుండి యెచ్చటికి
నేగద వేమిప్రయోజనార్థమై
యిచ్చట నిల్చితీవనిన
నేఱి తినంజని కుక్షినిండఁ గాఁ
జెచ్చెర నుక్కపట్టునకుఁ
జేరఁగఁబోయెడిప్రొద్దులేమి నా
కిచ్చట నుండఁగా వలసె
నిట్టిది నావిధమంచుఁ జెప్పినన్. 2

క. అగుఁగాక నిలువు మనిహం
సగణం బంతయును బలుక సంకటపడుచున్
సుగుణుఁడు మతిమంతుం డనుఁ
దగవెఱిఁగినయంచ యొకటి దా నిట్లనియెన్. 3

సీ. సబము నెంగిళ్లు దీనిభోజనము క్రూర
మిట్టిమెగ్గులు వేయును నేలచెప్ప
ఖగములంచుఁ జండాలుఁడు కాకమనుట
కదుఁబ్రసిద్ధంబుఁగాదె యానోమువ్రువినరె. 4

క. వల దీరే యిది మనకడ
నిలిచినఁ గీడొందు మనల నేఁ జెల్లిటిలో
పలఁ జేరకున్నఁ గాలము
తలనైనను జేరు నింత తథ్యము సుండీ. 5

వ. అనుటయుఁ గార్యం బెఱుఁగనితరుణమరాళములు కొన్ని
యమ్మతిమంతునుద్దేశించి. 6

సీ. ఇంతవద్దువాద మీకాకి యొక్కటి
యొక్కరాతిరిచట నున్నమాత్రఁ
గీడు సేరు ననుచుఁ గీనువగొట్టుట
యుద్దివెఱవు గాక యెఱుక యగునె. 7

క. పెక్కులు బుద్ధులు గఱచిన
నెక్కుడు భయమనుట నిక్కమింక బహూక్తుల్
తక్కు మిదియుఁగా కిది తా
నెక్కడికిం బోవుఁ దిమిర మిప్పుడు రాఁగాఁ. 8

క. అని పలికి దాని నుండం
బనిచి యభీష్టంబు లైనఫలములచే భో

జనమొనరింపఁగ నుండఁగఁ
దినయిమ్ముల వాయసంబు దగ నివసించెన్. 9

వ. ఇట్లు వసియించి. 10

గీ. అచట రెట్టఁబెట్టె యరోకాదయము గాఁగఁ
దడయకరిగెనంత దాని రెట్ట
శిలలసంధిఁ బొంద మొలచె నం దొకవట
భూజఫలములోని బీజముండి. 11

మ. అది నానాఁటికిఁ జేర్చి శాఖల విహా
యస్స్పర్శ మై యుండఁగాఁ
బదియేండ్లం జనునంత నూడలు కడుం
బల్వారి వర్ధిల్లుచుం
గదిసెన్ వచ్చి యధిత్యకాతలమువం
కన్ మాఁనఁదాఁ బ్రాఁకియ
భ్యుదితానంది కిరాతుఁ డొగ్గెనురు లా
భూజంబునం దెల్లెడన్. 12

చ. ఉరులు కుజంబునం గలయ
నొగ్గి నిషాదుఁడు చన్న మీఁద భా
స్కరుఁ డపరాద్రిఁ జేరె జల
జాతవసంబులఁ గ్రీడ మాని స
త్వరగతి మీఁటి మీఁదికి సి
తచ్ఛదముల్ చనుదెంచి యాఁగి వా

గురికలఁ జిక్కి యన్నియును
గుందుతఱిన్ మతిమంతుఁ డిట్లనున్. 13

మ. మన కీపాటులు వచ్చెఁ జూచితిరె నా
మాటల్ వృథాహంకృతిన్
వినఁగా నొల్లక యల్లరాత్రి యిచటన్
మీ రెల్ల వాదాడి యుం
చిన యాకాకము రెట్టలో మొలిచి హె
చ్చెం జూవె యీమఱ్ఱి డి
గ్గిన యాయూడలఁ బ్రాఁకి కాదె మన కొ
గ్గిం బోయఁ డీజాలమున్. 14

క. తగువానిపలుకు సేయుట
తగవెఱుఁగక యడిచిపడమి తమవారలతో
సగుణత్వము గొను టుత్తము
లగుణము లటు గామి యరయ నధమగుణంబుల్. 15

చ. అనవుడు నంచ లిట్లనుమ
హాత్మ భవత్ప్రతిభావిలంఘనం
బున మన కిట్టికీడిపుడు
పుట్టె నుపాయము కల్మి దీనిఁ బా
పనలవియేనిఁ బాపి హిత
బంధుల నిన్నును గాచికొమ్ము నీ

పనిచినయట్ల చేసి భట

భావముఁ జొందెద మెల్లవారమున్. 16

వ. అనుటయు మతిమంతుం డిట్లనియె—పరస్పరవశ్యు లగు బంధువు లాపద గడవవచ్చు నింకనైన మదీయవచనంబు లంగీకరించెద రేని వినుం-డని మతిమంతుం డిట్లనియె. 17

సీ. కంఠమూలంబునఁ గదిసినయీయురు
లూడిచికొనిపోవు యుక్తి లేదు
గాని చావక యుండఁ గల దుపాయం బైక
మత్యంబు గలిగిన మనకు నెల్ల
నెట్లన్న నిజ్జాల మొడ్డినవేఁటకాఁ
డే తెంచు నిందుకు వేగ తడయ
కప్పుడు మన మెల్ల నవగతప్రాణుల
కరణి నుండినఁ జాలు నురులఁ బాపి

గీ. చచ్చినవి మున్న యని తాను జంపు టుడిగి
వటముకిందికి నన్నిటి దిగవైచు వాఁడు
డిగ్గ నరుదెంచుతఱిఁ గని దిగ్గనంగఁ
బాఱిపోద మెవ్వరమును బట్టువడక. 18

వ. అనుటయు సంతసిల్లి మరాలంబు లన్నియు నిది లెస్సమతం బని నిశ్చయించి యమ్మతిమంతుమపదేశంబున నట్లయుం డెనంత. 19

గీ. వేఁటయు వచ్చి బోయ యవ్విహగయూథ
మున్నచందంబుఁ గనుఁగొని యుల్ల మలరఁ
గెడసినవి పులుఁగు లురులచే మెడలు బిగిసి
యనుచు వట మెక్కి డిగ్గవైచె నంతవట్టు. 20

క. ఒకఁ డొకఁడు డిగ్గవైవఁగ
సకలంబును బ్రోవు గట్టి సంభ్రమమున ని
ల్వక చనె మతిమంతుఁ డొకఁడు
నొక కడపటిశాఖయందు నురి నుండంగన్. 21

గీ. ఆతనిరాకఁ దలంపక యధికభీతిఁ
బోవుటయు బిచ్చపడి ముండపులుఁగు లకట
మోసపుచ్చెర నన్నని డాసి బోయ
యలిగి మతిమంతుమెడ బిగ్గ నులిమి చంపె. 22

క. మతి ధృతి లేనివెడంగుల
మతి గలిపినసుమతికిం బ్రమాదము వచ్చున్
మతి గలిపిన మతిమంతుఁడు
సితచ్ఛదోత్కరముచేతఁ జెడ్డవిధమునన్. 23

క. మతిమంతుం డవ్విధమున
హతుఁ డయ్యెం దక్కఁగలుగు హంసలు దుఃఖా
యతనంబు లయ్యెఁ దముఁ గు
త్సితకాకం బొక్కరేయి సేరినకతనన్. 24

## ౫. క్రూరులెప్పుడును గృతఘ్నులే.



శా. లీలానిర్జితసర్వజంతు వన బ
ల్మిన్ బేరుకొన్నట్టి శా
ర్దూలం బొక్కజరన్మృగంబు నొకచో
దుర్దాంతమై వ్రేసి త
త్కీలాలం బది మున్న గ్రోలి యుదరో
ద్దీవ్యద్బుభుక్షానల
జ్వాలల్ తన్నలఁపంగఁ దల్చి శితమాం
సం బొంది భక్షింపఁగన్. 1

ఉ. కోటలసంధి నెంపములు
గ్రుంకిన నంత దినక్రమంబునన్
మీఱిననొవ్వి భుక్తిఁ గొన
నేరక యాననగహ్వరంబునం
గాటెములాలతోడఁ బులి
గ్రిచ్చుటె లోఁబడియుండ మ్రానిపైఁ
గూటినవంత నొక్కద్రుమ
కుట్టవిహంగము దాని కిట్లనెన్. 2

ఉ. నొవ్వియలంపఁ గూసెదవు
నో కొకమాటును మాయ వేలొకో
తివ్వలు కాలఁ జుట్టినను
దెల్పఁగలేవు తరక్షునాథ నీ

కివ్విధ మైనయాపదకు
　　నేదికతంబు విధాత యక్కటా
యెవ్వరి నెట్లు సేయఁడు వి
　　హీనమతిం బ్రతికూలుఁ డైనచోఁ. 3

క. అనుటయు దానికిఁ జెప్పం
దనపొందిన వేధ పులి; యుదారోపాయం
బునఁ దీనిఁ బుత్తు నేమే
లొనరించెద నని విహంగ మొయ్యనఁ బలికెన్. 4

చ. అనవుడుఁ జిత్రకాయము ప్రి
　　యంబున నట్టిదయేని నొక్కమే
లని మితిసేయ నేమిటికి
　　నాప్తసఖుండుగ నిన్నుఁ జేసి యే
వనమున నేమిజంతువు న
　　వారణఁ జంపిన మాంస మర్థముం
గొను మని యిత్తు నేహితముఁ
　　గోరినఁ జేయుదు నీకు నెచ్చెలీ. 5

క. నావుడుఁ బెద్దయుఁ విప్పగ
నీవదనముఁ దెఱవు మనుచు నియమించి దురం
తావిర్భావితసాహస
మై విహగం బంతఁ జొచ్చె నతినిపుణతతోన్. 6

గీ. దంష్ట్రికలు పాదమునఁ గొని తన్ని సంధి
నున్న యెముకను సంచున నూఁది పట్టి
పాపి కదిలిచి పెఱికి యాపక్షి యధిక
వేగమునఁ బులివాఁగడ వెడలిపోయి. 7

క. ద్రుమశాఖనెక్కి యెముకను
నుమిసినఁ బులినోరు నొవ్వియుడిగి మఱి దిన
క్రమమునఁ బుండాఱిన నొ
క్కమహామృగమును వధించికొని యొకచోటన్. 8

క. సమలంగా నచ్చోటికి
ద్రుమకుట్టము వచ్చి కట్టెదుట నిలిచి మృగో
త్తమ నాభుక్తికిఁ దగుమాం
సము వెట్టుము పలుకు మృదువచనములు నాతోన్. 9

. అని పలుకుటయు. 10

. నీ వెవ్వరు మాంసం బే
లా వలసె నీకు నేను లంచము వెట్టన్
నీవు వులుఁగ వే మృగపతి
నావచనమ్ములఁ బ్రయోజనము నీ కేలా. 11

క. అనవుడు నెఱుఁగవె నన్ను వ
దనకుహరములోనఁ జొచ్చి దాడలయెడ నా
టినశల్యముఁ బెఱికిన చెలిఁ
జనునే నను మఱవ నీకు శార్దూలపతీ. 12

వ. అనుపలుకువినినవ్వుచునది యాద్రుమకుట్టంబుతోఁ బ్లిరిచె.

గీ. కాయ లుడివోయినట్టి వృక్షంబుఁ బాఁడి
యెల్లఁ గడచిన ధేనువు నేఁటుఁ గడపి
నతఁడుఁ గార్యము దీర్చినయతఁడు నపుడ
గాని యాదరణీయులు కారు పినప. 14

వ. అది యెట్టిదనిన వినుము. 15

మ. విపినాంతర్భవహింసతత్త్వఘాతుకుఁడ నై
విఖ్యాతకృత్యుండ నై
కృప యొక్కింతయు లేని నావదనముం
గ్రిడారతిం జొచ్చినం
గుపితత్వంబున మ్రింగినం జనఁగ నీ
కుం గ్రిమ్మఱం గల్గునే
యుపకారం బన నింతకంతె మఱియుం
గోం డెద్ది యూహింపుమా. 16

వ. అని యిట్లావ్యాఘ్రింబు ప్రిలాపింప నప్పటికిం జేయునది
లేక ద్రుమకుట్టంబు తొలఁగిపోయి యాత్మగతంబున. 17

క. ఇలపైఁ బాదాహతమై
తలవ్రెడు నెగసి ఘూర్ణిత నొకరునిచే
నలఁపఁబడి వాని దేహతలం
దలకిన యచ్చోనటికంటెఁ దక్కువ కాఁడే. 18

మ. అని చిత్తంబునఁ దెంపుఁజేసికొని రో
షాధిష్ఠమై పొంచి కీ
డొనరింపం దఱి వేచి యుండి విహగం
బొక్కింత యాలస్యమున్
నిన శార్దూలముకన్ను వోఁబొడిచి పూ
ర్ణీభూతసంతోషమై
చని భూజాగ్రముఁ బొంది యిట్లనియె హా
స్యప్రౌఢవాక్యంబులన్.

క. వింటే మృగమా పోయిన
కంటికి వగవకుము రెండుకన్నులు-వోలియుం
గొంట యుడుగుటకు నొకక
న్నుంటకు సంతసముఁ జెందుఁ టుచితము నీకున్.

క. అని పలికి యది నిజేచ్ఛం
జనుటయు నయనంబునొవ్వి సైఁపక పులి య
వ్వన మమ్రివన్ వాపోవుచు
దనదు కృతఘ్నత్వమునన తా హతమయ్యెన్.

వ. కావున.

క. బలహీను లగుచు ధీమం
తుల కెగ్గులు సేసి పొందుదురు కీడు మహా
బలులయ్యు మాంనిపోటుం
బులుఁగుఁ బరిభవించి పెద్దపులి చెడ్డక్రియన్.

## ౬. అల్పు లుపకారులనే యవమానింతురు.



కోసలదేశంబున ధా
రాసముఁ డనఁగాఁ గలండు రాజతఁడు నయ
వ్యాసంగము ధర్మంబున్
బాసి చరింపంగఁ దొడఁగెఁ బ్రజలు దలంకన్. 1

ఆరాజు సేయునెగ్గులు
కారణముగ జనపదమునఁ గఱవగుటయు ము
న్నారాష్ట్రంబు దమకు నా
ధారమ్ముగ నుండుకాశితండం బెల్లన్. 2

ఒకయెడం గూడుకొని. 3

ముంగిళ్ళ సెండువులు గా
నంగఁబడవు గలుగుపట్టునం గాపుఘనం
బెంగిలి మెతుకులు చల్లుట
యుం గలుగదు మున్నవోలె నుర్విఁ దఱచుగన్. 4

కసు బలు లిడలే రిచ్చటి
వెడమాయపుటాస లెల్ల వేగ విడిచి యొం
డెడ కరిగి నేరిచినక్రియఁ
గడుపులు రక్షించుకొనుట కార్యము మనకున్. 5

అని కాకుల్ తమదేశమున్ విడిచి భు
క్త్యాకాంక్ష నెందేనియుం

జనుచో దవ్వులఁ బోవ నొక్కయెడఁ గా
సారంబులోనుండి క
న్గాని మోదంబున నీరుకాకు లనుప
క్షుల్ పక్షిజాతిత్వమా
త్రనిబద్ధం బగు బాంధవంబునన చే
రంబోయి ప్రార్థించుచున్.

ఉ. తోకొనివచ్చినం దొలుతఁ
దోయజషండము దన్ను తియ్యనీ
రేకట వోవఁ గ్రోలి దరి
నిమ్మగుచెట్టుల నీడ నుండఁగాఁ
బోకలు గట్టి వారిఖగ
ముల్ తమముందఱఁ బెట్టు మీలఁ బే
రాఁకలి యెల్లఁ దీర్చుకొని
యచ్చట నద్దినరాత్రిముండుచున్.

సీ. కదలి వేకువ నేఁగఁగడగుచో నవ్వాఁడు
నీరుకాకులు వచ్చి మీర లేమి
పనికి నెవ్వాటికిఁ జనియెద రనిన మా
వసియించుదేశ మనావగ్రహమున
గలుగిన నాహారములు లేక యిందుఁ
బండిన భూముల కొండకడకు

నరిగెద మనిన వాయసములఁ గాఁ కండ
వములట్టిదేని నేవలను నేల

గీ. యిచట నిల్వఁ డింక దీకొల నెన్నఁడు
జలచరములు నిందుఁ జాలఁ గలవు
ననుడుఁ గాకు లబ్బ వామిషంబులు మాకు
మేము నీఁదు వెరవు లేమిఁ జేసి.                    8

క. కావున నుదరము లిచ్చుట
నేవెరవునఁ బోవిచికొండు మే మనుటయు నా
మీవిధ మెఱుఁగుచు నొండొక
కావునకుం బోవనిచ్చుట తగవె మాకున్.                9

వ. అని మఱియును.                                  10

క. కారండవమ్ము లనియెన్
మీ రూరక కొలనికడుత నిలువుఁడు మీకా
హారంబులు గా నిచ్చెలు
వారిచరోత్కరముఁ బెట్టువారము తవియన్.

వ. అనుటయు నగుఁగాక యని నిలిచి.

మ. జలపక్షుల్ వెలివైవఁ గొవ్వి గలమ
త్స్యవ్రాతముల్ మింగుచున్
జలజావాససమీపకుంజశిశిర
చ్ఛాయాప్రదేశంబులన్



లలిఁ గ్రీడించుచు నేలన ల్పమితకా
లం బచ్చటం బుచ్చి య
బ్బలిపుష్టంబులు పుష్టదేహములతోఁ
బ్రహ్లాదముం జెందుచున్. 13

క. తమదేశంబున దుర్భి
క్షము వాయుట యరసి యొఱిఁగి చనుచుండి విచా
రము సేయఁ దొడఁగె నప్పుడు
తమలో నన్నిచఖగవితానము లెల్లన్. 14

క. కారండవములు మన కుప
కారము చేసినవి వీనిఁ గన్నుమొఱఁగి పో
నేరక యుండినఁ బ్రత్యుప
కారము సేయంగ శక్తి కలదే పిదపన్. 15

వ. అనుపలుకులు విని యందుఁ గొన్ని యిట్లనియె. 16

క. వీరికిఁ జెప్పక పోయినఁ
జోరత్వమువచ్చుఁ జెప్పి సులభప్రీతిన్
వీ రనుపఁ జనినఁ బ్రత్యుప
కారం బొకయపుడు సేయఁగావలయుఁ దుదిన్. 17

వ. అట్లగుటం జేసి. 18

క. వీరు మనకుఁ జేసినయుప
కారం బప్పగ నీడేల్ల కైకొనిపోవన్

వీరిపయిం దప్పొక్కటి
యారోపింపుదముగాక యదియెల్లఁ జెపుమన్. 19

క. అనవుడు వీరలమీఁదను
నొనరింపఁగ దోస మొకటి యొనరినయది క
ల్గునె యనుచు వెదకి కొఱఁతలు
గనుఁగొని యన్నియును జలఖగంబులకడకుఁ. 20

వ. చని వాని నుద్దేశించి. 21

క. చిరజీవము మానాము
సరకే·మా కొకటి యిష్టసంచారముమై
నడుగక మీ రిటు నాఁపినఁ
బరిభవములఁ బొంద నాపఁబడితిమి మీచేన్. 22

చ. నెల పదిప్రొద్దు లేమిచట
నిల్చినమాత్రన మాకు మీర లెం
గిలిసతతంబు పెట్టితిరి
కిల్బిషవర్తనులార యక్కటల్
కలుగనె యెట్టివారికి జ
గంబున నోడల బంట్లు బంట్ల నో
డలుఁ జనుదెంచునంట యక
టా వినరే యిటుఁజేయఁ గూడునే. 23

వ. అదియునుంగాక. 24

క. పుచ్ఛంబు లెత్తి మీవగు
పుచ్ఛంబులక్రిందు నూకుఁ బోరెఁ జూపుచు న
స్వచ్ఛ లయి సీటఁ గ్రుంకెడు
తుచ్ఛల మిమ్ముఁ దిట్టఁ జాలుదుమె యెల్లెనక్. 25

గీ. వ్రతులు మాలోన సగ ముండ్రు వార లిచటఁ
జేరు టాదిగ నొల్ల రాహార మెపుడు
సరసిఁ గ్రుంకుచు మీరు పుచ్ఛములక్రిందఁ
జూపఁ జూచుచుఁ గోఁతలు చుట్టుకొనిన. 26

వ. అని పలికి 27

క. మీకొఱగాములు సర్వము
మీకుండుంగాకయనుచు మింటఁగ లగొనన్
గా కా యని యఱచుచు వెసఁ
గాకులు పూర్వప్రదేశగమనముఁ జెందెన్. 28

వ. అట్లగుటం జేసి.

క. ఉపకార ముత్తముఁడు తన
కృపమెుక్కలమున నొసర్పఁ గిల్బిషుఁ డొకప్ర
త్యుపకారము వెదకం డొక
యుపకారమె రోయు నొండె నాపదఁ జేయున్. 30

## ౭. లోభము నాశనహేతువు.

సీ. విజయపురప్రాంతవిపినాంతరమునను
బోయ యొక్కఁడు వేఁటవోయి యచట
వనహస్తిఁ గనుఁగొని వల్మీక మెక్కి భ
ల్లమునఁ దుండము ద్రుంచి సమయఁజేసె
వానియెక్కిన పుట్టలోన వెల్వడి భుజం
గం బక్కిరాతునిఁ గఱచె నంత
వాఁడును మొలనున్న వాఁడికుఠారంబు
గొని దాని వధియించి కూలి యీల్గె

గీ. నచటి కొక్కనక్క యరుదెంచి ముదమంది
యేనుఁ గాఱునెలలు మానవుండు
సప్తవాసరములు సర్ప మేకదినంబుఁ
బోవుఁబొమ్మ తనకు భుక్తి యనుచు. 1

క. నేఁటి కివి గంటివెట్టఁగ
నేఁటికి నీబోయవింట నిడ్డనరము లీ
పూఁటఁ గడపఁజాలవె యొక
నాఁటం బ్రాణంబు సనునె నవసినమాత్రన్. 2

క. అని తలఁచి యెక్కుపెట్టిన
ధనువుఁ గదిసి దానికొమ్ముఁ దనగొంతుం గ్రో
లున మోచియుండఁ జెలఁగుచుఁ
గొనయంబునరంబు లొయ్యఁ గొఱకఁ దొడంగెన్. 3

గీ. నరము లొక్కఁ డొక్కఁడు నానిచి కొఱకంగ
గొనయ మెల్లఁ ద్రెవ్వి ధనువుకొమ్ము
మిడిసి గళమునాఁటి పెడతల వెడలినఁ
గూసికొనుచు నక్క కూలి గెడసె. 4

వ. అట్లగుటంజేసి లోభం బొప్పదు. 5

## ౮. అతివ్యయ మాపదకు మూలము.

గీ. పెక్కునీళులు లేనట్టి యొక్కమడుఁగు
కేరివ నున్నత మగునారికేళ మొకటి
చీకుకొక్కెర యొకటి వసించు నచట
వారిబహుతరజలచరాహార మగుచు. 1

క. అది యొకనాఁ డంబరమునఁ
బదివేలు బకాదివారిపక్షులు సనఁగా
నదె నాకొలసాములు వో
యెద రని యడ్డముగఁ బాఱి యెక్కుడుప్రియముల్. 2

క. కావించి మీర లూరక
పోవుట దగ దల్లభూజమున నిలుతు మదీ
యావాసం బది యచటికి
రావలయును బాంధవాభిరంజన మొసఁగన్. 3

224.



వ. అని తనవసియించు నారికేళంబును జూపి ప్రార్థించి మఱి
యును. 4

క. కొల నొక్కటి కల దచ్చట
జలములు నాహారములు పరిశస్తరుచులతోఁ
గలిగెడి నేఁటికి మాటలు
కొల మెల్లను బొగడ విందు గోరి యొసర్తున్. 5

వ. అను పలుకులు విని బుద్ధిమంతంబు లగు విహంగములు
కొన్ని. 6

చ. వలవదు మమ్ముఁ నాఁగ గుణ
వంతుఁడ వీవు కొలంబువారిపైఁ
గలిగిన భక్తియుం బ్రియముఁ
గన్గొన సంతసమయ్యె నిచ్చలున్
నిలిచినఁగాని కాదె గమ
నింపఁగనిమ్మని పెక్కుభంగులన్
బలికినఁ బోవకున్నఁ గని
పక్షులలోపలఁ గొన్ని దానితోన్. 7

క. ఈయూథ మిది యనంతము
నీయిర వెడలేదు నిలువ నీచెప్పినయా
తోయంబుల నాహారము
మాయెఱుఁగనియవియె యల్పమాత్రము లవియున్. 8

వ. అట్లుంగాక. 9

క. కనుకొలఁకు వంద లివి మఱి
చను నొండొకదెసకు నీవు చాలవు నీకొ
క్కని కైనను జలదాగమ
మునయంతను నోర్చు మనఁగు బోనిమ్ము మమున్.

చ. అనుటయుఁ బొత్తువారికృప
నన్నియుఁ గల్గెడు నన్నుఁ ద్రోచిపో
యినఁ గులమెల్లఁ గన్గొనఁగ
నిప్పుడ మేను దొఱంగువాఁడజుం
డనుమఁ బతత్త్రికోటి మన
కారడిఁ బాపముఁ బొందనేఁటి కి
ట్లని యతఁ డాడ నంచుఁ జని
రందఱుఁ గొక్కెరయింటివిందు లై.

వ. అట్లు పోయి.

మ. మడు వెల్ల న్వెరఁజాడి మందుకయినన్
మత్స్యంబు లేకుండఁగన
వ్వడ యొండొంటికి మున్ను మ్రింగి విహగం
బుల్ మాపు నిల్వంగ ని
క్కడ నిమ్మిమియుఁ జాల దంచుఁ జనినం
గారించు పేరాఁకటన్
మఱిసెన్ గొక్కెర కొన్నిప్రొద్దులకు హీ
నంబైనదేహంబుతోఁ.

వ. అట్లగుటంజేసి. 14

క. వ్యవసాయము కొలఁదియు దే
శవిధముఁ గాలంబుఁ బూర్వసంచిత మగుసా
మ్మ విచారింపక యుబ్బునఁ
దివిరి వ్యయముసేయునతఁడు దీనతఁ జెందున్. 15

---

౯. అవివేకులకు హితము దెలుపుటకూడ హానియే.

---

క. కానన మొక్కటబహుఫల
సూనక మొకమ్రాన నొక్క సూచీముఖము
న్వానరమును దమలోపల
నూనిన నెయ్యమున నుండ నొకనాఁటి నిశిన్. 1

క. మిన్నెల్ల నీలమేఘ
చ్ఛన్నంబై యొక్కవాన సాంద్రజలంబై
మున్నుగురిసి తుది నీదయు
సన్నపుఁ జినుకులును విపినచరబాధలుగాన్. 2

వ. ఎడతెగక యున్న సమయంబున వానరంబు చలియగు
నగ్గిజిగాఁ డొకనాఁడు. 3

చ. మినుఁగుఱుఁబుర్వు వెన్న తగు
మృత్తికపాదున నంటఁజేసి యొ

క్కడనఅలోన నిడ్డ నది
యిమ్ములఁగ్రాలెడు రూపరేఖగాఁ
దడియని గూటిలోనఁ బ్రియ
దారయుఁ దానును నుండి నీతునం
గొదుఁగుర వోయియున్న సఖుఁ
గోర్కిఁతిఁ గనుంగొని చాలఁ గుందుచున్.    4

వ. నీడచ్వారంబునకుం జనుదెంచి యతనితోడ.    5

క. వడఁకెదు గదయ్యె వానకు
నుడుకువ లేదయ్యె రాత్రి యుగమునుగాకె
న్నఁడువేగునె యెవ్విధమున
నుడుగు న్నీబాధ యెట్టు లూరక నిలుతున్.    6

క. ఎడలేదు నిన్ను రమ్మనఁ
గడుసన్నము నాగృహంబు కపివర పెక్కా
డెడిదేమి యిట్టిపుట్టుగు
వడసినపుడకాదె నాదుపౌరుష మడఁగెన్.    7

ఉ. మచ్చిక రెట్టిగాఁగఁ దన
మందిర మొండి యభీష్టవస్తువుల్
నెచ్చెలు లెల్లఁ బొంది సుఖ
లీలఁ జరింపఁగఁ జేయలేమికిన్
వెచ్చనియూర్పు నించికొని
విన్నఁదవంబును బొంది నెవ్వగ

వ. అని శార్దూలంబు పలికిన మృగేంద్రుం డిట్లనియె. 33

ఉ. గోవుల విప్రులం దఱిమి
కూడక ముట్టి భుజించు తచ్ఛరీ
రావృత మాంసపోషణము
నం దనిశంబును మేను పెంచుటన్
గావిటువంటి కల్మషవి
కారపు మేనులు భక్ష్యభోజ్యముల్
నీవుదొలంగు మాఁకటికి
నేఁడును నోర్చెద వ్యాఘ్రపుంగవా. 34

వ. అని మదోత్కటుండు పలికినఁ బుండరీకంబు సలజ్జావనత వదన ఖిన్నత్వంబునం దొలఁగి చనినఁ దదనంతరంబ కథనకుం డతనిం గదియంజని మచ్ఛరీరంబున భవదాత్మరక్షణంబు గావింపందగునన్న నాక్షణంబ. 36

క. వడినుతికి లొట్టిపిట్టను
మెడఁగొఱలఁ గఱచిపట్టి మేదినిమీఁదం
బడఁదిగిచిన శార్దూలము
నొడఁగూడిన నక్క తాను నుదరము వ్రచ్చెన్. 36

వ. వ్రచ్చి తచ్ఛరీరమాంసంబు మృగపతికిం బెట్టి తచ్ఛేషంబు గోమాయు వ్యాఘ్రి కాకంబు లనుభవించె. 37

కొవ్వఁజూచి నన్ను నొప్పింపఁజాలవు
వాలకున్న నేనచత్తు నాశ
రీరమాంసమిపుడు ప్రియమున భక్షింపు
మనఘ నాకు దీన నగుముదంబు.
అనినఁ గాకంబునకు సింహం బిట్లనియె.
అల్పమాంసమిందు నాప్యాయనముగాదు
వట్టిహింస నాకుఁ గట్టనేల
యనిన నాలకించి యమ్మృగేంద్రునితోడ
జంబుకంబు పలికె సౌమ్యఫణితి.
నాదేహము నీకిచ్చితిఁ
గాదనక భుజింపు స్వామికార్యముసేయం
బ్రోదిగల నాకు నిదె నీ
పాదంబులె దిక్కుసూవె పరమార్థముగన్.

అనిన విని మదోత్కటుండు కాకంబుతోడఁ బల్కినట్ల యమ్మృగధూర్తంబునకుం బ్రత్యుత్తరంబిచ్చినఁ బులి కదియం జనుదెంచి సాష్టాంగ నమస్కారంబుచేసి వినయపూర్వకంబుగా నిట్లనియె.

ఎవ్వరు నేఁటికి నామెయిఁ
గ్రొవ్విన మాంసంబు గలదు కొను మాఁకలియున్
నొవ్విడియును దీఱు నంతట
నవ్వల నారోగ్యమగు మృగాధిప నీకున్.

ష్పదతిగినట్టిచోటను బు
భుక్షితుఁడై దురితంబు చేయఁగా
మదిఁ దలపోయకుండుసె పి
మాదముపుట్టుఁ దొలంగిపోదమా. 18

వ. అనినఁ గాకంబునకు శార్దూలం బిట్లనియె మాస్వామి మ
హావ్యాధిపీడితుండును బుభుక్షితుండునునై యున్నయెడఁ
దొలంగిపోవుట భృత్యన్యాయంబుగా దతని సమ్ముఖంబు
నకుం బోవుదమని కదలునంతం గథనకుండుం గూడుకొ
న్న నన్నలువురుం జని సింహంబు బహిర్ద్వారంబునఁ గథ
నకుని నిలిపి మువ్వురుంజని మదోత్కటునకుం బ్రణమిల్లి
యిట్లనిరి. 19

గీ. అధిప గిరిగహ్వరముల కుగ్రాటవులకు
నరిగి యామిషమబ్బక తిరిగితిరిగి
చిక్కితిమి నీవు చిక్కి నశింపనేల
విన్నవించెద మేమొక వెరవు వినుము.

గీ. కథనకుండు మిమ్ముఁ గార్యార్థియై వచ్చి
కొలిచినాఁడు గాని నిలువలేదు
వాఁడు నీకుఁ మాకు వలయుభోజనమగుఁ
బ్రియము వదలి మట్టుపెట్టితేని. 21

వ. అని కాకంబు పలికిన విని మృగేంద్రుండు కర్ణస్పర్శపూ
ర్వకంబుగా హరిస్మరణంబుసేయుచు నభయవాక్యంబులొ

సం॥ కొలిపించుకొని యిట్లు సేయందగునే వినుమని యి
ట్లనియె. 22

మ. ధనదానంబును నన్నదానమును గో
దానంబు భూదానముల్
వినుమిట్లే యభయప్రదానమునకున్
సాటిక్కంబు తుల్యంబులౌ
ననరాదీయెడ నశ్వమేధ మఘపు
ణ్యంబుల్ భయభ్రాంతుఁగా
చిన పుణ్యంబునఁ బోలదంచు సుజనుల్
చెప్పంగ వింటిందగన్. 2

వ. అనిన గాకం బిట్లనియె. 24

గీ. కులముకొఱకువిడుచుఁ గొఱగానిపుత్త్రునిఁ
గులముఁ విడుచు నూరునిలుపుకొఱకు
భూమికొఱకువిడుచు బోరనగ్రామంబు
ధాత్రివిడుచు నృపుఁడు తనకుఁ గాను. 25

వ. కావున నేమందఱముం గలిగియుఁ బ్రయోజనంబులేదు
సకల జంతురక్షకుండవగు నీ శరీరంబు నిలిచినంజాలు నా
దేహంబీపూఁట కాహారంబుసేయ నవధరింపుమని వాయ
సంబు పలికిన విని మృగపతి యూరకున్నయెడ లబ్ధావకా
శుఁడై తిక్కటన ముఖ్వరుం గూడుకొని యతనిముందఱ ని
లిచియుండి వాయసంబు మఱియు నిట్లనియె.

న్వెచ్చినయట్లు సజ్జనుఁడు
వేఱొకదుర్దశచేత నొచ్చునే. 8

క. ఓర్వం డెఱుఁగక యుండఁగ
నోర్వం డెఱుఁగంగఁ జూడకుండఁగ నోర్వం
డోర్వఁడు సూడఁగ సుజనుం
డుర్విం దనవారి కైన నొప్పము లెందున్. 9

వ. అని తగుమాటలాడి పెద్దయు వగచి మఱియు నప్పక్షి యిట్లనియె. 10

గీ. కాలఁజేతఁ బేదగావు నీయట్టివాఁ
డకట యుండఁదగిన యాలయంబు
మున్ను జేసికొనని మోసాన నీపాట్లు
పడఁగవలసె నిపుడు నడికిరేయి. 11

క. అని పక్షి హితము చెప్పిన
విని వెంగలి యైనకోఁతి వీఁ డిరవున నా
లును దాను నుండి నన్నొక
పినుఁగుం గాఁ దలఁచికాదె ప్రేలఁ దొడంగెన్. 12

క. తనయింట దివియ యుండఁగ
నను గాయు మనండు నెగడి నాతోఁ గొఱమా
లినమాటల నిసుమంతయుఁ
గొనకుండఁగ నాడె నిట్టికుటిలుఁడు కలఁడే. 13

చ. తనకఁటె యిల్లు గల్గె నఁటె
            తా దొర నాకఁటె యిల్లు లేదు! న
  న్ననఁ గడుఁ గ్రొవ్వె నీపులుఁగు
            పుచ్చెద దీనిమదం బటంచుఁ బె
  ళ్ళనఁ దరుశాఖ విర్చి కపి
            యచ్చటి చేరువఁ బల్వలోదకం
  బునఁ బడవైచె నంత వెఱ
            పుట్టి ఖగాంగన గూయుచుండఁగన్. 14

వ. అప్పుడు. 15

క. లడిసినయెఱకలు నీళ్ళం
  బడి బెగడిన మనసు గలుగు ప్రాణేశ్వరి న
  య్యెడ నుడిపితెచ్చి యొండొక
  యెడకుం గొని యేఁగి పక్షి యిమ్ముల నుండెన్. 16

క. కావున వివేకహీనుల
  క్రోవం బోవలదు వారితోడి చెలిమి దా
  నేవెంట నైన నాపద
  గావింపకపోదు సుమతికలితుల కైనన్. 17

## ౧౦. సుమతిపగ మేలు విమతి నెయ్యమున కంటె.

క. మందరపురిం గాంతాజన
కందర్పుఁడు గలఁడు రాజు ఖగవృత్తిసమా
ఖ్యందనరి బుద్ధిమంతులఁ
జెందఁడు సాకురుఁడు గాఁడు శిశుకాలమునన్. ౧

క. గర్వోద్ధతచాపలమున
దుర్వర్తనుఁ డైన నృపసుతునిచే నిమమల్
సర్వము గని తన్మంత్రులు
దుర్వారాసహ్యబహుళ దుఃఖాన్వితులై. 2

వ. ఆత్మగతంబున. ౩

సీ. అక్షరజ్ఞుఁడు గాని యతినికి శాస్త్రపు
రాణాగమాదులు రావు సారఁగ
గ్రంథాధిగమశక్తి గలుగక శుద్ధవి
వేకంబు లేదు వివేకశుద్ధి
కలుగక కర్తవ్యకర్మ మెఱుంగఁడు
కర్తవ్య మెఱుఁగక కడఁగి చేయు
క్రియల నీగఁగరాని కిల్బిషంబులఁ బొందుఁ
బాపుండు నరకకూపమునఁ ద్రెస్సు

గీ. నరకవాసి వేదనరుఁ డగుఁ బేదయై
కడుపుకొఱకుఁ బాతకములు చేసి

రౌరవమునఁగూలు గ్రిమ్మఱి నట్ల యా
పదలకెల్లఁ గుదురు చదువులేమి.

వ. అని చింతించుచుండ నక్కాలంబున.

సీ. ఎలుకవేఁటలపేర నేఁగి పట్టణములోఁ
బ్రజలయిండులు కూలఁద్రవ్వఁబంపుఁ
జెలఁగి జేగలకుఁ దొండలనేయఁబోయి
ద్రాక్షామంటపంబులు గాసిసేయుఁ
గోడిపోరులపేర వాడలఁ దిరుగుచుఁ
బొడఁగన్న కడవలఁ బొలియవైచు
వేఁటకుక్కలఁ దెచ్చి విడిచి మందలలోని
మేఁకల కుసికొల్పి మెచ్చియార్చుఁ

గీ. గాలకింకరులట్టి కింకరులతోడఁ
గూసి రాఁగూడి ప్రొద్దునఁ గడుపుదోరఁగి
వెడఁగుఁదనముఁ బ్రల్లదమును వేనవేలు
మదముతోఁ జేయుచును రాకుమారుఁడిట్లు.

క. ఉరులును బోనులు గూళ్ళును
బరుసని చెద్దములు గాలిపడగలు బొరిఁగిం
కరులం బొడిపించెడి యా
సరభసములు దక్క నొండు సైఁప వతనికిన్.

క. ఆనరపతి యనుపుగ నొక
వానరపోతంబుఁ దెచ్చి వాత్సల్యముతో

దానిఁ జెనిచి యస్త్రాయుధవి
ద్యానిపుణతఁ బొందఁజేసి యనివర్ధిలుడున్. 8
కంచుకము దొడిగి కుండల
చంచత్కటకాతివేషచయమిడి శితఖ
డ్గాంచితరూపముతోఁ దన
కంచుకియై యుండఁబనిచెఁ గదలక యెపుడున్. 9
ఆరాజు మందిరో ద్యానంబునకునేఁగి
యొకనాఁడు తాను బ్రహ్మోజముఖులుఁ
దడవుగాఁ గ్రీడించి యొడలు నిద్రాలసం
బగుటయునందఱ నచట నచట
వసియింపుఁ డనిపంచి వనచర మొక్కఁడ
తోడరా దట్టంపునీడ నిలిచి
పరిమళమ్మృదుసిత పవనంబు నెలవైన
గురివెందపందిరి గుజ్జుసెజ్జ
సుప్తుఁ డగుచుండి వానరుఁ జూచి నన్ను
డాయవచ్చిన జీవుల వేయు ఖడ్గ
ధారఁ దునియంగ ననిచెప్పి కూరె నిద్రఁ
గపియుఁ బనిపూని భూపతిఁ గాచియుండె. 10
ఆసమయంబున. 11
సునునోదామము రాజుకంధరమునన్
శోభిల్లు నత్తావికై

భ్రమరం బొక్కటిమూఁగ దానిఁగని కో
పవ్యగ్రమై క్రోఁతి ఖ
డ్గమునన్వేసినఁ జేఁటితోన ధరణీ
కాంతావతంసంబుకం
ఠము రెండయ్యె వినీతుఁడైన పతిచే
ష్టల్ చేటు దేకుండునే. 12

---

## ౧౧. చెఱుపఁదలఁచువాఁడే చెడిపోవును.

గీ. నందిసీనామనగరంబునందు గలఁడు
బంధుగుం డనియెడు నొక బ్రాహ్మణుండు
ధనికుఁ డఁట తొల్లి యవిలంఘ్యదైవఘటనఁ
బిన్నలై పుత్రు లుండంగఁ బేదవడియె. 1

వ. అప్పు డతం డాత్మగతంబున. 2

మ. బలవద్దైన్యము వక్త్రగహ్వరముగాఁ
బలోప్చెట్టఁ గొన్నట్టియ
ప్పులు మైచాలులుగాఁగ బొలుపుదితం
బు ల్రోఁగుట ల్గాఁగ దు
ర్మ్నలయారణ్యముతో భయప్రకరమూ
ర్తి క్రూరమై యుండఁగాఁ

దలమే వెల్వడఁజేయు లావుకలిమిన్
దారిద్ర్యశార్దూలముల్. 3

ఉ. ఐనను దీనిఁ బాపఁదగు
యత్నము చేసెదఁగాక చిత్రవ
ర్ణనగరంబులో గుణగ
రిష్ఠుఁడుఁ బూర్ణధనుండునై మదీ
యానుజుఁ డున్నవాఁడు విపు
లాఖ్యుఁడు వానికి సొమ్ముగల్గఁగా
నే నిటు బీదనై నవిధ
మిచ్చ నెఱింగిన వాఁడు కుందఁడే. 4

వ. అతం డొసంగు కనకము గొనివచ్చి యిచటం గర్షకుండ
నయ్యెద. 5

సీ. ఈలోక మింతయు నాలుగుపాళు లిం
దొకట భిక్షుకులు సోమకులు నొక్క
పాలు సేవావృత్తి బ్రదికెడువారు వి
ద్యోపజీవికులును నొక్కపాలు
వ్యవహార మాడెడువారుఁ దస్కరులును
నొకపాలు కర్షకు లొక్కపాలు
కొలఁదిపాళ్లు మూఁడుఁ బిదపటిపాలి
యనవరతంబును నపహరించు

గీ. నపహరించియు నంతంత కవి నశించు
నపహృతం బయ్యు నది వృద్ధినందుచుండుఁ
గానఁ దగురాజు గలిగినఁ గరిసనంపు
జీవనముఁ బోల దొండొకజీవనంబు. 6

క. అని తలఁచి కదలి కతిపయ
దినముల ననుజపురి చేరి తెరువున డస్సెన్
దనువు మును బేదయై నలిఁ
గినమానవముకంటె మిగులఁ గృశమై యుండన్. 7

మ. అనుజాగారముఁ జేరివచ్చిన నతం
డల్లంతఁ దా నగ్రజుం
గని సందేహము వొందియున్ గమనరే
ఖామాత్రి శోధించి క
న్గొని కన్నీరునఁ బాదము ల్గడిగి స
న్మోదమ్మునతో నెత్తి దీ
వన డగ్గుత్తిక డింద నాతఁ డదిమె
న్వాక్కుంబుతోఁ దమ్మునిన్. 8

తదనంతరంబున. 9

విపులుం డగ్రజునకుఁ దగు
నుపచారంబులు ప్రమోద నుత్కటముగ ని
ర్కపుభక్తిఁ జలిపి యాతఁను
విపన్నుఁ డగు టతనిచేత విని దుఃఖితుఁ డై. 10

వ. నిజపుత్రకళత్రసహితంబుగా నాతని నిష్టదేవతానిర్విశేషం
బున నారాధించుచుండ నొక్కమాసంబు చన బంధుసుం
డు తమ్మునితో నొకనాఁటిరాత్రి యెల్లి యవశ్యంబునుం
దనకుఁ బయనంబు సేయవలయు నని నిర్బంధించి పలికిన
నర్ధరాత్రిసమయంబున నవ్విపులుండు దనయంగణంబున
గతపరిసాంద్రమాధవీలతాచ్ఛన్నం బగు చూతకుంజంబు
క్రిందికిం బూర్వజుం దోడ్కొని యేఁగి వేఁకువనె యతనిప
యనం బగుటఁ దన్నిమిత్తంబు లగు మాటలాడె. 11

క. కొనిపోవరాదు తెరువునఁ
గనకము తెక్కలిఘనంబు కాకున్నను మో
వనురాదు పెద్దహేమం
బని యన్నకుఁ దెలియఁజెప్పి యకుటిలమతియై. 12

వ. అనేకనిష్కసహస్రమూల్యం బగు నొక్కమాణిక్యం బ
నికి మ్రింగ నిచ్చి మీరు ప్రభాతంబున జీర్ణమలినాంబర
బులు ధరియించి యరుగునది యని చెప్పి యిరువురు శయ
నస్థానంబుల కరుగుటయు. 13

క. వారలపలుకులుఁ దద్వ్యా
పారంబులుఁ దెలియనెఱిఁగి ప్రమదహృదయుఁడై
చోరుం డొకరుం డచ్చటి
భూరుహమున నుండి వారు పోయినవెనుకన్. 14

ఉ. కన్నము వెట్టఁ జన్న నొక
కంచముఁ జీరయుఁ గాక యబ్బ దా
స న్నిలువం బ్రిమాద మది
చాలఁగ లాభము చేరె నాకు నే
నిన్నిశి వ్రుచ్చి వేగుతటి
నిప్పటివిప్రుని గూడి పోవుచుం
గన్నపువేఁట మాని మణిఁ
గైకొని ధన్యుఁడ నై చరించెదన్. 15

వ. అని నిశ్చయించి యచ్చటు వాసి పోయి ప్రభాతం బగు
టయు. 16

గీ. సమనమై పోవు బ్రాహ్మణుపజ్జఁ దగిలి
సాధుగోలె నాతనితోడ సముచితంపు
భావలాపముచుఁ దనచేయుపనికి ననువు
తలఁచికొనుఁ జోరకుండును దనమనమున. 17

క. నడుమ నలనడదు ముందటి
యడవిం దెగఁజూతు విప్రు నని తలఁచుచు న
య్యడవిఁ దరిసి యరుగఁగ న
క్కడఁ దెక్కలికాలు వచ్చి కడురౌద్రమునన్. 18

క. ఇరువురఁ గట్టియుఁ గొట్టియుఁ
బరిభవములు వెట్టఁ జేదపన్నల మనుచున్

గరుణముగఁ బలుకఁగాఁ గృప
యొరగినచిత్తముల వార లొండొరుతోడన్. 19
ఈయొడళుల కీకోకలు
వేయైనను దగవు కపటవేషము లివి యీ
మాయలకు మనకు లేదె యు
పాయము చీరుదము వీరిఁబట్టి యుదరముల్. 20
అనుచుండ నందులో ముఖ్యులగువారు. 21
వ్రిత్త మొకనికడుపు వ్రియ్యంగ నందులోఁ
బసిఁడి లేక యున్నఁ బరుని బ్రిదికి
యరుగనిత్త ముండినక్లైన నితరుని
ప్రవత్త మిదియె కార్యవృత్త మనుచు. 22
నిశ్చయించి తమ యిరువురిలోపల నొకని వధియింప ను
ద్యుక్తు లగుసమయంబుసం జోరుం డాత్మగతంబున. 23
ఏనేమి తలఁచి వచ్చినఁ
దానేమి తలంచె నిచట దైవం బవురా
తా నొక్కటి తలఁపఁగ విధి
తా నొక్కటి తలఁచు ననుట తథ్యం బయ్యెన్. 24
పాపనుఁడు బ్రాహ్మణుం డని
భావింప కకారణముగఁ బాపాత్ముఁడ నై
యీవిప్రుఁ జంపఁదలఁచితి
నావిధి యిట్లుండ నట్లు నా కేలబ్బున్. 25

ఉ. ఒప్పమి సేయఁడేనిఁ దగు
　　　నుత్తమవంశజుఁ డేని నేరికిం
దప్పొనరింపఁ డేని నతి
　　　ధార్మికుఁ డేని దురాత్ములైనవా
రప్పురుషావతంసమున
　　　కాఱడి యొగ్గొనరింపఁ జూచినం
దప్పునె చేటు వారలకు
　　　దైవముకన్నులు పుట్టుఁజీకులే. 26

గీ. ఇతనికడుపు వ్రచ్చి యిం దిప్డు రత్నంబుఁ
గాంచిరేనిఁ దనదుకడుపు వ్రిత్తు
రురక చంపిపోదు రూరక విడువరు
కడుపు వ్రచ్చు టెట్లు గట్టి తనకు. 27

వ. అయినను. 28

క. తనకడుపు మున్న వ్రచ్చినఁ
గనకము లేకున్న నతనిఁ గాచెద రెట్లుం
దను విడువ రింక బహుచిం
తనములఁ బని యేల కాచెదంగా కితనిన్. 29

వ. అట్లుంగాక. 30

క. క్షీణకరుణచే బ్రాహ్మణుఁ
బ్రాణముఁ గొనఁదలఁచినట్టిపాపము మగుడం

ఘ్రాణంబుఁ గాచి యతనికిఁ
బ్రాణం బీకున్న నెట్లు పాయఁగనేర్చున్. 31

వ. అని కృతనిశ్చయుండై. 32

క. తనకడుపు మున్ను వ్రచ్చం
డనుటయు నటుఁజేసివార లందేమి యుఁ గా
ననివారై యీతని వ్ర
చ్చిన యట్టుల కాదె యేల చెనఁటిగఁజంపన్. 33

వ. అనుచు నవ్విప్రుబంధముక్తునిం జేసి నిజేచ్ఛం జనుమను
టయు. 34

క. కూ్రరులచే విడివడి సుత,
దారాదులఁ గలసి యతఁడు ధన్యుం డయ్యెం
జోరుఁడు వివేకమానస
చోరుఁడు నాకమున కరిగి సుఖియై యుండెన్. 35

క. అవివేకచరిత మట్టిది
సవివేకచరిత్ర మిట్టిచందం బగుటన్
సవివేక హీను సంగతిఁ
దవులఁగవల దాపదలకుఁ దప్పఁ దలఁచినన్. 36

## ౧౭. మతిమంతు లుపాయముచే శత్రుల జయింతురు.

చ. ఒకపెనుగానలో నొకమ
హోన్నతభూజమునందు బాలశా
బకములఁ బ్రిస్ఫుటప్రబల
పక్షములం గలవానిఁ బ్రోచి కొం
చొకశుకి యుండు నత్తరువు
నొద్దన చిక్కని వెల్గమానియం
దొకఫణినాయకుండు గర
ళోల్బణుఁడుం డొకకోటరంబునన్.

వ. అట్లారెండును నుండ నంత నొక్కనాఁడు. 2

క. తొల్లియు నచ్చోటన తన
పిల్లలఁగొని చన్నబోయ పెద్దయుఁ గ్రూరుం
డుల్లమలర నబ్భూరుహ
మల్లన నెక్కి తనకూర్చునాత్మజయుగమున్. 3

క. చంచులు దెఱచుచు నఱవఁగ
నించుక కృపలేక పట్టు కేర్పడఁ గనిశో
కించుచు రోధించుచుఁ బల
వించుచు నాతనికిఁ జిలుకవెలఁది యిటు లనెన్. 4

క. అన్నన్న లేవె పక్షులు
కన్నులు తెఱవనివి తిన్నఁ గలదే చవినా

మన్నిఁ గొననేల విడువఁ గ
దన్న యకట చంపఁగూడ నయ్య శిశువులన్. 5

చ. అనవుడు బోయ యిట్లను శు
కాంగనతో నడలంగనేల నీ
తనయులఁ జంప నేను బిసి
తంబులు బ్రోఁతిమె నాకు వీనిఁ గై
కొని వెలవెట్టు వారికడ
కుం జని యమ్ముదు విల్చి వారునున్
బెనుతురు గాని వీని కొక
పీడ యొనర్పరు నమ్ము నెమ్మదిన్. 6

క. అనవుడు దానికిఁ గీరాం
గన సంపఁగ నొల్ల వేనిఁ గనకముపైఁ గాం
క్షను పట్టితేని విడు నా
తనయుల నీ కేను జూపెదను హేమంబున్.

మ. ప్రకటశ్రీయుతుఁ డొక్క డీయడవిలోఁ
బాటచ్చరశ్రేణిబా
ధకు నుల్లంబున నోడి మున్న తనయ
ర్థంబొక్కచో డాఁచెఁ ద
ద్వ్యక యేఁజూచితి నున్న దాపసిఁడిఁ జూ
పంజాలుదు న్నన్నుఁ బు

త్రికులం గాచెద నెల్లనాఁడు నని పం
తం బాడి రక్షింపుమా. 8

మ. అనినం బెన్నిధి యప్పుడే కనిన యా
ట్లానందముం బొంది యే
నిను నమ్మింపుదు నంచు శాబకముల
న్నీడంబులోఁ బెట్టి చ
య్యన భూమీజము డిగ్గి బోయ నియతుం
డై యొక్కచో నిల్చియు
ర్లను బోనుక్ వెసముట్టి నమ్మఁదగుప
ల్కుల్ పల్కె నిర్వంచనన్. 9

వ. అప్పుడు కీరవనిత వానితో నిట్లనియె. 10

క. నమ్మిక లవి యేమిటికిం
గ్రమ్మఱ వచ్చెదవె నీవు ఖగమృగభయముల్
ఖమ్ములకును నాచూపెను
సొమ్ములపైఁ జేయి వెట్టి సుఖివై నతుదిన్. 11

వ. అనిపలికి యిదె రమ్మని తోడ్కొని చని.

గీ. పూనుఁగాడియం భుజగంబు లోనున్న
వెలఁగ్రమాని వెడఁదతోలట నూపి
దీనఁ జేయివెట్టి లోన నున్నది సవి
శేష హేమ మనుచుఁ జిలుక చెప్పె. 13

ఉ. చెప్పిన వెఱ్ఱిబోయ వల
చే యటు సొన్పుచు నందు గన్నులన్
నిప్పులు రాలుచున్న మహా
సీయుగరోజ్జ్వలభీషణోరగం
బుప్పలవాయిఁదిన్న విష
ముగ్రత నెక్కుడు దృష్టి చీఁకటుల్
గప్పఁగ నోరఁ బెన్నురువు
గ్రమ్మ మృతుండయి కూలె మేదినిన్. 14

గీ. ఆస పాపజాతి యఖిలంబుపైఁ బాఱుఁ
బసిఁడిమీఁద నేలపాఱకుండు
పసిఁడిమీఁద నాసపాఱినమనుజుండు
తనకు వచ్చుకీడు తలఁపఁ గలఁడె. 15

క. తనచే నసాధ్యుఁ డగు శ
త్రుని నన్యునిచేతనైనఁ ద్రుంగునటులుగా
నొనరింపవలయుఁ దా నెఱుఁ
గనివాఁడునుబోలె నీతికౌశల మెసఁగన్. 16

## ౧౩. మొగమోటము ముప్పు దెచ్చును.

క. యక్షపురంబునఁ గలఁ డొక
యక్షుఁడు ప్రియభాషణుఁ డన నతనివనిత ప
ద్మాక్షి నిపుణిక యనంగల
దక్షుదప్రేమ్నవహుఁ డాతఁ డయ్యతివయెడన్. 1

క. ఆరమణి గర్భభరశ్రం
గారంబున నొప్పెఁ బౌరగణ మట్టియెడన్
క్షీరాబ్ధినాథునుత్సవ
మారాధ్యం బగుటఁ జూడ నని యేగుటయున్. 2

వ. ప్రియభాషణుండు నిపుణికతోడ. 3

ఉ. కొండికదాన వెన్నఁడును
గ్రొత్తవినోదముఁ జూడ వింటఁ గా
వుండెద నేను నీవు నను
ముత్సవ మిమ్ములఁ జూడ నన్న నీ
వుండఁగ నొంటి నేఁ జనుట
యుక్తమె కాదని పల్కితేని నీ
నిండిన చూలు మోచుకొని
నేర్తునె యచ్చటి కేను బోవఁగన్. 4

అనుటయు నీవటఁ జను మిటఁ
జనుదెంచినయంతదాఁకఁ జామా నీతా

ల్చినగర్భముఁ దాల్చెద నని
తనకుక్షిం జూలు మోచి తరుణిం బంచెన్. 5

చ. పనిచినఁ బోయి చూడ్కులకుఁ
బండువనందగు నుత్సవంబు నిం
పెనయఁగఁ జూచి వారుఁ దమ
యిక్కలకుం జనఁగా రసాంతరం
బున మనమూఁది యింటిదెస
వోవుట మాని విభుండు మున్నుఁ జే
సిన యుపకారముల్ మఱచి
చేడియ చింతయొనర్చె నాత్మలోన్. 6

ఉ. ఇంటికి నేను బోఁ దడవె
యెప్పటిగర్భము నిచ్చువాఁడు నా
కంటికి నిద్రలేక యది
కైకొని మోవఁగ నేల వానిచేఁ
గొంటినొ తింటినో యతని
కుత్సితబీజము వానిమీఁదనే
తుప్రింటితి నింత నాకొరుల
దూఱు బొగడ్తయుఁ జూడ నేఁటికిన్. 7

ఉ. చూలు వహించి వెక్కుచును
సుక్కుచు నుండి ప్రసూతివేదనం

జాలఁ గలంగి యాపదను
జక్కపడంగను నాకు నేల నా
పాలిటిదయ్య మద్దోసఁగు
వాపినఁ గ్రమ్మఱ నేల పోమనం
చాలలితాంగి వేఱ యొక
యక్షుని గూడి నిజేచ్ఛ నేఁగినన్. 8

వ. అంతట. 9

క. కడు పథికముగాఁ బెరిఁగిన
వెడమాయంబేని నూర్పు వెడలక కడులోఁ
బడి యాలికి విలపించుచు
వెడఁగగుయక్షుండు ప్రాణవిరహితుఁ డయ్యెన్. 10

క. తగ దొరుల నమ్మ నెప్పుడుఁ
దగువారల నమ్మిరేనిఁ దగుఁగాక మహిం
బగవారల నమ్మఁదగదు
పగవారలకంటె వలదు భామల నమ్మన్. 11

. బలుపున మెలపునఁ గేళిన
కులభామిని వెఱచుఁ గూర్చుఁ గుమతిత్వమునన్
దల నెక్కించుకొనం బతి
కులమును బ్రాణంబు సొమ్ము కోమలి చెఱచున్. 12

## ౧౪. దుష్టుల నమ్మియు నమ్మకుండవలెను.



క. క్రూరోరగగ్రహణవిష
హారియనంబరఁగునొక్కఁ డతిశయవిషదు
ర్వారము నొక సర్పంబు న
భీరుండై పట్టి వెదురుఁబెట్టియఁ బెట్టెన్. 1

క. పట్టి దానికి నెరగాఁగఁ బట్టి యొక్క
మూషకమువైచి పెట్టియమున్నవోతెఁ
గట్టిడించిన నురగంబుగఱవరాఁగ
నెలుక బెదరక దానితో నిట్టు లనియె. 2

క. నీ కుపకారము సేసెద
నా కభయం బిచ్చి కావు నా కార్యంబున్
నీ కార్యంబులు మేలై
చేకుఱు నాతోడఁ జెలిమి చేసితివేనిన్. 3

గీ. వాఁడు పట్టినపుడ వానిచే నైనను
జావవలయుఁ దనకుఁ జావు నిజము
చచ్చియున్న నన్నుఁ జంపి చావని నీకుఁ
జెఱనయుండఁ దలఁచు టెఱుక యగునె. 4

క. ఏ నధికబలుఁడ నాచే
గానిది యీ యెలుకచేతఁ గానోపునే

తానా చెలు లేవిధమున
మానుచు నిది కల్లయనుచు మదిఁ దలఁపకుమీ. 5

క. విను మెవ్వాఁ డేకార్యం
బున నిపుణుఁడు దానియందుఁ బూజ్యుఁడు హీనుం
డనవలదు సూదినయ్యెడు
పని చిక్కనికఱుతచేతఁ బాగై యున్నే. 6

ఉ. చాలనభీష్టముల్ తనవ
శంబుగఁ జేయు నరోగ్యుఁడైన న
మ్మేలుఁ దలంచి దానియెడ
మిక్కిలి వేడుకసేఁత నేర్పగుం
గాలపువేఁటకాఁడు ఝష
కాంక్షన తా నుదకంబుమీఁదటన్
దేలెడు దృష్టిపై నిలుపు
దృష్టియుఁ జిత్తము నాదరంబునన్. 6

క. తనకార్యముకొఱకై హీ
నుని యొద్దకునైనఁ బోఁజను మహిం జండా
లునియింటి కుపశ్రుతికై
చనుననఁగా స్వార్థమూఁది సద్విజుఁడైనన్. 7

క. నా చెప్పినట్లు చేసిన
నీచెలువిడు నట్లుఁగాక నిలుపోపక నీ

వే చంపి నన్ను నోరను
వై చికొనిన మానునే భవత్కుతెల్లన్. 8

మ. చెఱయేఁ బాపిన నిష్ఠమైన వలనం
జెన్నొందఁ గ్రీడించుచున్
జిఱుఁగప్పల్చివిమాలు బల్లు లెలుకల్
చిట్టెల్కలాహారముల్
వఱలన్ గుత్తుకబంటి తెమ్మెరలఁ గ్రో
లంబెట్ట పెంబాముతో
నెఱియున్ భోగముసుట్టునుంగలుగు నీ
వీక్షింపుమా నెమ్మదిన్. 9

క. అనవుడు నురగము సంతస
మున నాఖువుతోడ స్వప్నమున నైనను గీ
డొనరింప నీవు నాచెలి
వనుమానముఁ దక్కనమ్ము మానందముతోన్. 1(

వ. ఇక్కరండనిగ్రహ మెట్లుడి పెదవుడుపుమనటయు. 1

క. ఏ నొక మంత్రిమునీతల
పై నుండి జపించి జపము వారించి తగం
గానినుఁ బిలిచెద కదలక
నీ నయనయుగంబు మూసి నిలు మందాకన్. 1

చ. అని నియమించి దాని శిర
మంజకరెక్కి కరండనిగ్రహం

బనువుగఁ జేసి యాఖునక
మప్పుడ పోయె ననంతరంబు లో
చనములు విచ్చిచూచి మది
సంతసమున్ వగపుందలిర్పనా
కనుమన తానుఁ నేగి భుజ
గం బాకబొక్కవసించి యాత్మలోన్. 13

క. ఎలుక కపటమున నాక
న్నులు వ్రామెను మ్రింగలేద నో రెరియఁ గటా
తొలఁగెద నిఁకేఁటిబ్రతుకని
తలఁచె దురాత్మకుల కెందుఁ దగవులు గలవే. 14

క. కెలనికి మేలుగఁ దనకుం
గలిగెడు నింద్రిత్వమైనఁ గాదనుఁ దుదిఁదాఁ
బొలిసిన మేలని తలఁచును
ఖలుఁ డొకనికిఁ గీడుసేయఁ గలిగినఁ జాలున్. 15

వ. ఇట్లుండి దాని బిలద్వారంబెఱింగి యయ్యాశీవిషం బమ్మూ
షకంబునకు దోషం బాపాదించు నభిలాషంబున. 16

గీ. దానిబొక్కకడకుఁ దా నేఁగి నాప్రాణ
సఖుఁడ యోఁగుదెమ్ము సత్వరముగ
నొక్కచోటనుండి యుచితసల్లాపమ్ముల్
సేయవలె నటంచుఁ జీఱుటయును. 17

క. లాఁగలు పెక్కులు లోపల
బాఁగై తను ముట్టినపుడ పట్టువడక లో
డాఁగి చని వెలికి వెలువడి
పోఁ గనుములు గలుగునట్టి బొక్కయెదిరికిన్. 18

వ. వచ్చి మృద్బద్ధంబైన బిలిద్వారంబున నిల్చి యాద్విజి
హ్వాంబుతో నిట్లనియె. 19

క. నన్ను మును నీవు గాచితి
నిన్నుం జెఱ కేను వాపి నిలిపితి నాకై
మున్ను గల కరుణ మఱవక
మన్నింపుము నాకు నంత మానవు చాలున్. 20

గీ. వియ్యమందఁ బోక కయ్య మొనర్చుట
చెలిమిసేఁత తమకుఁ దలము గాని
వారితోడఁ దగదు వలదు నీచెలిమికి
నేను హీనబలుఁడ నెంతవాఁడ. 21

క. మున్నీవు నాకు వైరివి
మిన్నక కార్యార్థమాత్ర మిత్రత్వమున
న్నన్ను సహింపుదువే చను
మిన్నిపలుకు లేల వెఱతు నే నినుఁ జేరన్. 23

వ. అనుటయు నయ్యహి సిగ్గువడి పోయె నమ్మూషకంబును
సుఖంబున నుండె. 23

క. నమ్మక పోరాదనుతఱి
నమ్మి రిపునిఁగలసి నమ్మనడచుట యొప్పన్
బిమ్మట నేమఱక తొలఁగి
నమ్మక యుండంగవలయు నరవర వానిన్. 24



## ౧౫. కారణము లేనిపని చేయరాదు.



చ. ఒక నగరంబుచేరువ మ
హోన్నత దేవగృహంబు జీర్ణమై
వికలతనొంది యర్థము భు
వింబడియుండఁగ దానిఁజూచి యు
త్సుకమతి నొక్క వైశ్యుఁ డది
తొల్లిటియందము నొందునట్లుగా
నకుటిలవృత్తిఁజేయుఁడని
యర్థములిచ్చిన శిల్పకారులున్. 1

క. ఇయ్యకొని నగరుగట్టుచు
నయ్యెడ నొక చేవదూల మది పలకలుగా
వ్రియ్యుటకు నాడనాడను
జయ్యనఁ గీలములుగాడఁ జఱిచిన పిదపన్. 2

గీ. పొట్టచేరఁబడినఁ బోయిరిండ్లకువారు
లాసమీపతరుల నాశ్రయించి
తిరుగు మర్కటములు దేవాలయంబున
కవల నివల మెలఁగునట్టి యెడను.



సీ. గుడియెక్కి తరులపైఁ గుప్పించునవియును
దరువులపైనుండి దాఁటునవియు
నురుతరశాఖల నూఁగాడు నవియును
బ్రాకారములు ప్రాఁకి పోవునవియు
గోపురంబులమీఁదఁ గూర్చుండునవియును
గోళ్ళఁ బిక్కలు వీపు గోఁకునవియు
నిక్కుచు బొమలెత్తి వెక్కిరించెడునవి
యొండొంటితోఁ బోరి యోడునవియు

గీ. నిట్లు వానరయూథంబు లిట్టునట్టు
సహజమగు చాపలంబున సంభ్రమింప
వానిలోపల నొక వృద్ధవానరంబు
దూరముగఁ బాఱి తా విధిప్రేరణమున.　4

క. కీలాకీర్ణస్తంభము
లోలతమై నెక్కి నెత్తియలో నండంబుల్
వ్రేలంగ రెండుకరముల
సీలం బెకలించి లావుచేఁ దిగియంగన్.　5

క. బిగువెడలి నీలయూడిన
నగచర బీజంబు లిఱుక నాఁ బొప్పిఁగడుఁ
వెగడొంది మొఱలు వెట్టుచుఁ
దెగియెఁ మర్కటము దానిత్రిమ్మట వింటే. 6

వ. కావునఁ దమకుం గారణంబులేని పనికిం జొచ్చిన మానవు
లు పెక్కుచిక్కులకు లోనగుదురు. 7

## ౧౬. స్వయంకృతాపరాధము.

ఉ. కలఁ డిల దేవశర్మ యనఁ
గా నొకయోగి యతంఁడు పెక్కు ది
క్కులఁ జరియించి నేర్పునఁగఁ
గూర్చిన యర్థము కంథలోపలం
బొలుపుగఁ బోసినై చుకొని
పోవఁగ నత్తెఱఁ గెల్లఁగాంచి ము
చ్చిలుటకు శిష్యభావమునఁ
జేరి యొకానొక దుర్జనుండొగిఁ. 1

గీ. నామమాషాఢభూతినా నటనమెఱసి
కదిసిభయభక్తులతనికిఁ గానఁబడఁగఁ

బరము విశ్వాస మెసఁగంగఁ బనులుచేసి
మెలఁగుసంతటఁ దపసియు మిగులనమ్మె. 2

క. ఈకంథ నాకు ప్రేఁగని
చేకొన నాషాఢభూతిచే నిచ్చి యతం
డాకందువ వనమధ్య త
టాకముఁ బొలుపారఁజూచి డాసికడంకన్. 3

క. ఆచమనం బొనరింపఁగ
నాచేరువ మేషయుగళ మత్యుగ్రముగాఁ
దోరచియును మస్తకంబులఁ
దాచియుఁ దమలోనఁబోరఁ దానవ్వేళన్. 4

గీ. తగరుదోయి తలలు దాఁకంగఁ దాఁకంగఁ
బగిలిరక్తమొలికిపడుచు గట్టి
కరముకట్ట మాంసఖండంబుగాఁజూచి
ఫేరవంబుమిగులఁ జేరవచ్చి. 5

వ. ఆరక్తం బాస్వాదింపఁగోరి మేషయుద్ధమధ్యంబని తలంప
నెఱుంగక దుర్బుద్ధియగు జంబుకంబు జిహ్వాచాపలంబునఁ
దదరిక్తం బుపయోగించు సమయంబున. 6

క. మునివాసివెనుక వెనుకకుఁ
జనితాఁకుతగళ్ళపడుమఁ జచ్చిన నక్కన్
గనుఁగొని వగచుచు భిక్షుకుఁ
డనయఁగ నాషాఢభూతి నెలమిం బిలువన్. 7

వ. వాఁడంతకుమున్న వసుభరితంబైన యాకంథ నపహరించి చనిన నెఱింగి మోసపోయితినని భిక్షుకుండు దనమనంబున మేషయుద్ధమధ్యంబున జంబుకంబునకును నాషాఢభూతి వలనఁ దనకును ననర్థకంబులయ్యెననుచుం జింతింపుచుం బోయెం. 8

## ౧౭. వంచకుని వంచించియే శాస్తిచేయవలయును.

చ. గురుసరసీతటంబునకుఁ
గొక్కెరవృద్ధొకఁ డేగుదెంచి ని
ర్భర నియమవ్రతాచరణ
భావముదోఁపఁగ మోమువాంచి కం
ధరముఁ గుదించి కన్నుఁగవ
దార్కొనమూసిన దానిఁజూచి యా
చ్చెరువునఁ గర్కటంబచటఁ
జేరి మృదూక్తుల నల్ల నిట్లనున్. 1

గీ. మిగులనాఁకంటి పెలుచ నొగిలి నీవు
చిక్కియును మీనుఁగదిసియుఁ జీరకునికి
యద్భుతంబయ్యెఁ జెప్పుమా యని కుళీర
కుఁడుగ దానికి బకవిభుఁడనియెనప్పుడు. 2

సీ. వక్రాలంకులనైన నిట్టట్టు మెలఁగెడు
మీనుల భక్షించి మేను పెంతుఁ
బెంచుచో నొకనాఁడు పిసుఁగుఁలో తెరువార్త
నాచెవినాటిన నాఁటనుండి
కడుపువిచారింపఁ గడువిచారంబునఁ
జిక్కితి నేమని చెప్పవాఁడ
ననినఁ గుళీరమేమని వింటివీవన్నఁ
గొక్కెర కన్నీరు గ్రుక్కుకొనుచు

గీ. ననియెఁగ్రై వర్తులిచటికి నరుగుదెంచి
వలలు నూఁతలు మొదలుగావలయునట్టి
సాధనంబులుగొని జలజంతుకోటిఁ
బొరిగొనఁగవత్తు మనఁగను బొసఁగవింటి. 3

గీ. అనికుళీరంబుతో బకమపుడుపలుక
నచటివితానంబులన్నియు నాలకించి
యోబకంబ మమ్మిందఱ నుద్ధరింపఁ
గలిగితివి నేఁటియాపద గడపవలయు. 4

వ. అనినంగొక్కెర యొకింతప్రొద్దు చింతించి మీకు నేఁజే
యందగిన కార్యంబెద్దియనిన నామత్స్యంబు లిట్లనియె. 5

క. ఇంకని జలములుగలిగిన
నింకొక్క యగాధసరసి నిడినం జాలున్

సంకోచింపక మము నీ
యంకితి వాపుటకు నీవ యర్హుండ వెందున్. 6

వ. అనిన నా బకం బిట్లనియె జాలరులవారింప నశక్తుండఁగా
ని మిమ్ము నొక్కొక్కరినె గ్రక్కున ముక్కునం గబళిం
చుకొని పోయి మీకు ననుకూలంబైన తావునఁ గ్రమ
క్రమంబున సందఱను బెట్టి వచ్చెదననిన నని సమ్మతించు
టయు నా బకంబు. 7

ఉ. ముక్కున నొక్కటిం గఱచి
మొక్కల మేమియు లేక పాఱి తా
నొక్క శిలాతలంబుపయి
నుండి రయంబున మెక్కి వచ్చి వే
ఱొక్కటిఁ గొంచుఁ బోయి యది
యుం దిని క్రమ్మఱఁ బాఱు తెంచి దా
నక్కఱదీఱ మత్స్యముల
నన్నిటిఁ జంపెను గాంక్షమీఱఁగన్. 8

వ. ఇట్లు క్రమక్రమంబునం గతిపయదినంబుల నాసరోవరం
బునంగల మత్స్యంబులనెల్ల భక్షించి మఱియుం దనివిచ
నక మత్స్యంబుల వెదకుచున్న బకంబుం గనుఁగొని కర్క
టకం బొక్కటి కదియం జనుదెంచి యిట్లనియె. 9

క. ఇమ్మడువు మీనములతో
నిమ్ములఁ గూడాడి పెరిగి యున్నాఁడను బేర్చి

మమ్మునముండితి నొంటిగఁ
గుర్తిమ్మఱ లేనింక నన్నుఁ గొనిపోవఁగదే. 10

క. నావుతుఁ గుళీరమాంసం
బేవినుకను నమలియెఱుఁగ నిదినేఁడొసఁగన్
దైవంబెయనుచు దానిని
వేవేగం గఱచిపట్టి విహగంబెలమిన్. 11

క. మును మత్స్యంబుల భక్షిం
చినయెడకుం గొంచుఁబోయి శిలపైఁ ద్రావా
లిన మత్స్యమాంసమేదో
ఘనగంధం బెఱఁగి యెండిక్రిడఁజకితంబై. 12

వ. ఇద్దురాత్ముండు కపటోపాయంబున విహంగంబులనెల్ల ని
చ్చోటవధియించెనని యెఱింగి తనలో నిట్లని వితర్కించె.

క. సాహసములేనివానికి
నూహింపఁగ బ్రతుకుగలదె యొకట ధరిత్రిం
బాహువిజృంభితశత్రు
వ్యూహంబులఁజంపుఁ జచ్చునొంపెఘనుఁడిలన్. 1

వ. అని మఱియుం గుళీరంబు దన మనంబున. 15

ఉ. ఏలొకో యుద్ధభూమి నొక
యించుకనిల్చి జయంబుఁగైకొనన్
జాలుటలేక పాఱుటెఱు
చావు శరీరము దాఁచుఁ దప్పునే

కాలవశంబుగాక యది
గాసక హీనుఁడు పాఱుఁ బ్రాజ్ఞుఁడా
వేళఁ దొలంగిపో కనుభ
వించును నిందును నందు సౌఖ్యముల్. 16

వ. అదియునుంగాక. 17

సీ. వైరంబు కొఱగాదు వసుధ నెవ్వారికి
నట్టిది బలవంత మయ్యెనేని
తగిన సాహాయ్యంబు దలఁగూర్చుకొని పగ
సాధింపవలయు నుత్సాహలీల
బలముఁ గూడకమున్న పగతుండు తఱివేచి
గొడగొనిచిక్కించు కొనియెనేని
నోడుఁగల పగఱపై నుఱికి చంపుటయొండె
రణమున వారిచేఁ జచ్చుటొండెఁ
గీ. బాఱి కలకాల మెవ్వఁడు బ్రతుకునంచుఁ
బ్రాణసందేహమునఁ దెగుఁ బ్రాజ్ఞుఁడెఱిఁగి
సాహసము చేయ నాకును సమయమనుచు
నుఱికి కొక్కెర కంఠంబుఁ గొఱికి చంపె. 18

వ. ఇట్లు చంపి యాకుళీరం బెటకేనియుం జనియె. 19

౧౮. భుజబలముకంటె బుద్ధిబలమే ఘనము.

ఉ. ఉగ్రవనంబులోన హరి
యొక్కఁడు వసియించి సర్వసత్వగ్రహణార్థియై బహువిధంబుల మాంసముఁ దించునుండఁ
దద్వ్యగ్రతఁ జూచి జంతుతతు
లన్నియుఁ గూడి మృగేంద్రుపాదపద్మాగ్రము తొడల ల్గడియ
నార్తిమెయిం బ్రణమిల్లి యిట్లనున్.　　1

సీ. అవధరింపు మృగేంద్ర యడవిజంతుసమూహ
మిదె విన్నపంబున కేఁగుదెంచె
నెట్లన్న నన్నింటి నెసరేఁగి యొక్కటఁ
జలపట్టి యొకనాఁటఁ జంపనేల
నిత్య మొక్కమృగంబు నీకుఁ గట్టడగాఁగఁ
బ్రీతి నాహారంబు పెట్టఁగలము
సమ్మతింపు మనిన సకలజంతువులకు
నట్లకానిమ్మని యభయ మొసఁగి
యనుప నవి పోయి నిత్యకృత్యంబుగాఁగ
నుదయ మయ్యెడికొలఁదికి నొకటిఁ జంప

నది భుజించి హర్యక్షము ముదముఁ బొందు
నీవిధంబునఁ జిరకాల మేఁగునంత. 2

క. పులి కోలుకాఁడు గావున
నలయక వరుసెఱిఁగి వాని ననుపఁగ నొకనాఁ
డొలసి యొక చెవులపోతుకుఁ
గలయఁగ నిలువరుస యనుచుఁ గ్రక్కునఁ జెప్పెన్. 3

గీ. పలుకు విన్నమాత్రి ప్రాణంబు చలియింప
శశక మపుడు మూర్ఛఁ జాలఁ దూలి
తెలిసి కన్నుదెఱచి దృష్టించి తలయూఁచి
దిగులుపుట్టి యాత్మ పగుల నొగిలి. 4

వ. ఆశశకంబు ముహూర్తమాత్రంబు చింతించి తెలివొంది
డెందంబు కొందలం బుడిపికొని వృద్ధుండయ్యును సాహసం
బుఁ దెచ్చుకొని తనలో నిట్లని వితర్కించె. 5

. కూరమృగనిగ్రహాగ్ర
స్ఫారమహాబలమృగేంద్రు సాహస మెసఁగన్
వారింతుఁ ద్రుంతు నొక్కఁడ
సారంబగు నాదుబుద్ధిచాతుర్యమునన్. 6

వ. అని మఱియుం దనమనంబున. 7

క. బుద్ధికి నశక్యమగు నని
యుద్ధాత్రిం గానఁగలదె యిదె గెలిచెద నా

బుద్ధిబలంబున సింహము
నుద్ధతి యణఁగించి ప్రాణముక్తికిఁ బాయన్. 8

క. అనుచుఁ దలపోసి యాశశ
మనుమానింపుచును గదలునప్పటికి నినుం
డు నభోమధ్యగతుం డగు
డు నతిక్షుత్పీడచేఁ గడుంగ్రోధముతోన్. 9

గీ. అప్పుడుగఱచి కంఠీరవం బౌర యివ్వ
నమున మృగములు నేఁడు గర్వమున నేఁటి
దినదినంబును నాకుఁ బుత్తెంచుమృగము
ననుప విది యేమొకో యనునవసరమున. 10

వ. అడుగులు తొట్రుపడంగా
నడలొందినయదియపోలె నయ్యెయెడలన్
బుడమిఁ బడి మొగ్గి లేచుచు
గడుసరి యగుశశక మెయ్యెఁ గదియం బోవన్.

క. అప్పుడు చూచి మృగేంద్రుఁడు
నిప్పులు కనుదోయినుండి నెగయఁగ నోరీ
చొప్పడదు వేళదప్పిన
యప్పటియశనంబు నాకు నహితం బగుచున్. 1.

క. అపరాహ్ణవేళదాఁకం
గపటంబున నీవు రానికారణ మేమీ

విపరీతంబులు పుట్టెనో
విపినంబున నున్న జంతువితతికి నెల్లన్. 13

వ. అని యివ్విధంబున రోషావేశంబునఁ బలుకుచున్న మృగేం
ద్రునకు సాష్టాంగదండప్రణామంబులు చేసి శశకం బిట్ల
నియె. 14

చ. కినియక చిత్తగింపు మొక
కీడును నాదెస లేదు నేఁడు సూ
ర్యుని యుదయంబువేళ నను
నొక్కమృగేంద్రుఁడు వచ్చి యడ్డగిం
చిన నిది యేల యేలిక భు
జింపఁగఁబోయెడి నన్నుఁ బోవని
మ్మనిన వనంబు జంతునివ
హంబుల కేలిక నేన కానొకో. 15

వ. అనుచుఁ బెద్దయుంబ్రొద్దతండు నన్ను దేవరసమ్ముఖంబు
నకుఁ బనివిననీక నిలిపి మఱియు నిట్లనియె. 16

క. నాకంటె నధికుఁ డెవ్వఁడు
నా కతనిం దెచ్చిచూపిన న్నిను మెత్తున్
లేకున్న నిన్నుఁ ద్రుంతుం
గాకని యతఁ డప్పు డనుపఁ గడు భీతిమెయిన్. 17

క. ఆవిధ మెఱిఁగించుటకై
దేవర యున్నెడకుఁ బాఱుతెంచితి నీకుం

దేవల్లసినట్టి మృగమును
రా విడువం డనిన నతఁడు రభసంబెసఁగన్. 18

క. ఏవంక నుండు నాహరి
యేవేళకు నాకుఁ జిక్కు నేనేభంగిన్
భావించి యతనిఁ గడియుదు
నావుడు నాతనికి శశకనాథుం డనియెన్. 19

క. సింగరబాఁకలిగొని సా
రంగాది మృగాళి వెనుక రయమునఁ జనునీ
వంగీకరించి కదలుము
వెంగలి మృగరాజుఁబట్ట వెఱపేమిటికిన్. 20

క. అను పలుకువిన్నమాత్రన
తన మదిఁ గ్రోధానలంబు దరికొన శశకం
బున కనియె నోరి! ముందఱ
వనమున వాఁడున్న దెసకు వడిఁ జనుమనుచున్. 21

సీ. ఆమృగేంద్రుండు మహాజవంబునఁ బోఁట
నతనిముందఱఁ దాను నతిరయమున
నెలయించి చెవులపో తెంతయు దూరంబు
గొనిపోయి మున్న చూచినయగాధ
జలములుగల కూప సన్నివేశంబున
నిటుచూడఁడి సింహశత్రుచికి నివాస

యోగ్యంబు నెల విదె యూహించి డగ్గఱి
చూడుమూయనఁ దొంగిచూచునప్పు
డాత్మదేహంబు కూపజలాంతరమునఁ
గాంచి వేఱొకసింహంబుగాఁ దలంచి
కన్నుగానక మార్ఖ్యంబు కతన నుఱికి
యపుడ మృతిఁబొందె దుర్బుద్ధియగుటఁ జేసి. 22

వ. కావున నెంతటి బలవంతునైనను బుద్ధిబలంబునంజేసి బు
ద్ధిమంతుండు గెలుచు. 23

---

## ౧౯. క్రూరులనడుమ సాధులు మననేరరు.

---

చ. అతుల మహోగ్రకాననము
నందు మదోత్కటనామసింహ ము
ద్ధతిఁ జరియించుదానికిఁ బ్ర
ధానులు కాకము పుండరీకముఁ
జతిగల జంబుకంబును గ్రొ
మ్మంబునఁ బంపొనరింపుచుండి యొ
క్కతఱి నరణ్యదేశమునఁ
గాంచిరి యుష్ట్రము నింపువేడుకన్. 1

మ. కని నీవెచ్చటనుండి వచ్చితనినం
గాకాది జంతుత్రయం
బునకున్ వందనమాచరించి యనియెన్
ముఁన్ సాధ్వాహుండు నీ
పున మోపింపఁగ మోసి డస్సి యెచటం
బోలేక దాఁగున్నవాఁ
డను మీరేగతి నన్నుఁ బ్రోచినను వే
డ్కన్నిల్తు మీపాందునన్. 2

వ. అని పలికిన యుష్ట్రంబునకు జంబుకంబిట్లనియె. 3

క. ఈ కాన నొక మృగేంద్రుఁడు
చేకొని సామ్రాజ్యపదవిఁ జెన్నువహించున్
మాకతఁడు కులస్వామిగఁ
గైకొని సేవింతు మెల్లకాలము కడఁకన్. 4

క. నీవును మాలో నొకఁడవు
గావున మృగరాజు సమ్ముఖంబున నిడి నే
నీవిధముఁ దెలియఁబలికి శు
భావహముగ భంగి నీకు ననుసంధింతున్. 5

క. అనుటయు నాలొట్టియయును
దనమది ముదమంది వెంటఁ దగిలిన వానిం
గొనిచని మృగపతిముందట
వినయముతో నతని తెఱఁగు వినిపించుటయున్.

వ. ఆమృగేంద్రుండును నయ్యుష్ట్రంబు నభయవాక్యంబులఁ బ్రమోదం బెసంగం జేసి కథనక నామధేయంబిడి నాపూర్వామాత్యులలో నీవొకండవై యుండుమని నియమించిన గోమాయు పుండరీక కాకంబులం గలిసి యతిస్నేహంబునఁ బెద్దకాలంబున్న సమయంబున నొక్కనాఁడు మదోత్కటుండు కాకవ్యాఘ్ర గోమాయూష్ట్రంబులం గనుంగొని యిట్లనియె. 7

ఉ. కల్యమునందు భక్ష్యమును
గానక మేనుకృశించె రోగ దౌ
ర్బల్యము నాకుఁ గల్గుటను
భద్రగజేంద్ర శిరఃపలాద బా
హుల్యము లేమి నుద్ధతికి
నోపక చిక్కితిఁగాన దేహమై
కల్యము మాను కైవడి సు
ఖంబగు పథ్యముఁ దెచ్చిపెట్టుఁడీ. 8

వ. అని పలికిన మృగేంద్రునకు నన్నలువురు నేకవాక్యంబుగా నిట్లనిరి. 9

తే. మీకుఁదగిన యాహారంబు మేముదెచ్చి
ప్రీతి నొకపూఁటకైనను బెట్టలేము
చాల నల్పులమగుట మాచంద మట్టి
దనిన మృగరాజు వారికి ననియె నపుడు. 10

ఏపాటి యశనమబ్బిన
నాపాటిం బొ్రిద్దుఁగడపి యట్లుండెద నా
కీపాపపుఁ దెవులొదవెం
జూపోపక దైవమిట్లు సొంపడఁగించెన్. 11

వడిఁబోయి మీరలిప్పటి
కడిదికి నేమాంసమైన గ్రక్కునఁ గొని రం
డెడసేయ కనుచుఁ బనిచిన
గడువడి నలువురునుబోయి గహనములోనన్. 12

పొదలుచొచ్చి చూచి పుట్టలువీక్షించి
చెట్టుగుట్టమొదలు చేరికాంచి
గిరులు నదులుఁ దొనలు చరికించి పరికించి
కాన నొకమృగంబుఁ గానలేక. 13

కాకవ్యాఘ్రిగోమాయుష్ట్రింబులు నలుదిక్కులకుం జెదరి
వెదకంబోయి కథనకుండు వెలిగా నొక్కచో ముప్పురుఁ
గూడుకొన్న సమయంబునఁ గాకంబిట్లనియె.

స్వామిపనిపూనివచ్చిన చందమునకు
నడవిలోపల నేమియు నబ్బదయ్యెఁ
గంటకాహారుఁడైన యాకథనకాఖ్యు
నతని కాహారముగఁజేయ ననువుగాదె. 14

తచ్ఛేషంబును మనకుఁ గొన్నిదినంబు లుదరపోషణంబు
నకుం జాలు గతకాలంబున ననేక మృగమాంసంబుల ష

నలఁ బోషించిన రాజున కీసంకటంబుఁ బాపందగదేయ
నఁ గాకంబునకు నివి యిట్లనిమె.

గీ. అభయమిచ్చి కరుణ నందజికంటెను
విభవమిచ్చినట్టి విభునిమొరఁగి
మనము వీనిఁజంప మదినెజింగినయేని
నాగ్రహించి మనల నాజ్ఞచేయు.

క. వేరెఱుకమాత్ర నధిపతి
చేరువ నంతంతఁ దిరుగు చిఱుతనినై నం
గారించెనేని సచివుని
భూరమణుఁడు గినియు వీనిఁబొనఁగునె చంపన్.

వ. కావున మనస్వామి యెఱుంగకయుండ నతనిఁ జంపు
కార్యంబుగాదనినఁ బుండరీక జంబుకంబులకుఁ గాకం
ట్లనిమె.

గీ. చావు తథ్యంబు మనకు విచారమేల
పెక్కు దివసంబు లాఁకటిపెల్లు కుందుచు
హారికి నెచ్చోట నేమియు దొరకదయ్యె
నరయ నింతకు దైవికంబట్లుకాదె.

చ. మది నధిక క్షుధార్తుఁడగు
మానవుఁ డాలిని బిడ్డ నొల్లఁ డిం
పుదనర సర్పముం దనకుఁ
బుట్టిన యండములన్ భుజించు నో